శ్రీ ర స్తు.

# సావిత్రీచరిత్రము

( హరికథ )

బ్రహ్మశ్రీ మదజ్జాడాదిభట్ల

## నారాయణదాస

విరచితము.

ఐదవ కూర్పు.

ప్రకాశకులు:

కంచుల గోవిందంగారు,

పీసుగుడ్సు మర్చంటు, బెజవాడ.

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1929.

 [వెల రు. 0-12-0]





శ్రీరస్తు.

# సావిత్రీ చరిత్రము.

గీ. సర్వమంగళ మమ్మ ప్రసన్నదృష్టి
గాంచు మాతల్లి సంశ్రిత కల్పవల్లి
రక్తియు విరక్తియుంభుక్తిముక్తినీవె
యవ్యయామృత మధురోక్తియాదిశక్తి॥

భైరవి—చతురస్రగతి.

ప॥ నన్నుబ్రోవుమా యమ్మా శార్వాణి ॥ న॥
పన్నగేంద్రభూషు పట్టంపురాణి॥ న॥
అ॥ కన్నతల్లి నన్నుం గావరాదటే!
నిన్ను వేడుకొన్న నీవాడనన్న ।
చ॥ పన్నగనా దిక్కెవరే నిన్నువినా!
కలలో నినుగన్నది నాకన్నుదోయి నిన్నరేయి హా ॥ న॥
౧ ఇపుడీనాకృతికి నీవేనాయిక ।
కృపతో దీనిగైకొన వేవేయిక।
అపరిమితానందముతో లపనజితా।
బ్జాహిత యద్రిపుని సుతా ।
జపాసుమాభపాణి భైరవి॥న॥

హంసధ్వని—ఆది

ప॥ కనికరమున నను గనుగణపతి నా।
మనవివినుము నినువేడెద బాడెద ॥గ॥
అ॥ వనజభవా ద్యమరవినుతచరితా ।
నిను నిత్యము గొనియాడెద నాడెద ॥ గ ॥

చ॥ ఘనదురితాటవీ దవానలవిఘ్ననీరద ప్రచండానిల।
ప్రణుతభక్తపారిజాత గిరిజాతనయా గనరాదయా।
దయామయ ॥ క ॥

౧ ఇలలోజనముల తొలిమ్రొక్కు నీదె।
జలజాసనాక్షి వతంసులకన్న।
కలనైనన్నిను మరచు దేటెకొక్కడిదినిజకార్యసిద్ధిదలంపక ॥
భళిరాయుం డాల్పెక్కుపడునుమత్ప్రదపద్యామృతముగ్రోలకున్న॥
జెలగించుము నా కావ్యంబు త్వంసీకృతసకలపరమహంసధ్వని ॥ క॥

## కన్నడ–మిశ్రగతి.

ప॥ అంబజోహారే దేవిజోహారే।
మమ్మేలుశారదాంబజోహారే॥యం॥
అ॥ బింబపులినోష్ఠనితంబజోహారే।
సమ్ముదితభక్తకదంబజోహారే।
చ॥ కంబులలితగ్రీవవీణా గానప్రదావితగ్రావ॥
సమ్మధితపావనికురంబప్రశస్తకుటిలాలకరోలంబ ॥యం॥
౧ నిన్నువినాదిక్కెవరేనాతల్లి సిఖిలాశ్రితకల్పవల్లి ।
పన్నగనా కావ్యమునీదయజల్లి ప్రచురించుము దేవతామతల్లి
ఉన్నతకవిస్తోత్రపాత్రభవోదధిసంతారణవహిత్ర ।
యెన్నగనీదురాయంచనడ నిందగుపర్బు మేలకన్నడ ॥యం॥

సీ. ముజ్జగంబులగలమూలరహస్యము లెరిగించుసహజకవీంద్రులార
నాలరుగందలిర్వగమోళ్ళలోకమానందింపబాడుగాంధర్వులార
వాణిజ్యకృషిశిల్పబహువిధసంగర లౌకికోద్యోగకళాపులార
దయయుసత్యంబు నిత్యంబుమూర్తిభవించువిధినొప్పారుభాగవతులార

శ్రేష్ఠులారా యజ్ఞసత్కర్మిష్ఠులార
మాయనంటెయు నంటని మహితులార

## సావిత్రీచరిత్రము.

అఖిలజనులార యమ్మలారయయ్యలార
సత్కథామృతముం గ్రోలి జయముగొనుడు.

### జెంజోటి - త్రిశ్ర.

ప॥ సుజనులారలెండు శౌరి - భజనజేసికొండు ॥సు॥

అ॥ నిజము తెలియరండుమీ - కెజయముగునుజుండు ॥సు॥

చ॥ గజబిజసంసారములో - రజస్తమోగుణములనల।
నజక్కివరవళితనిడుము - భజించుమనలబ్బుముక్తి ॥సు॥

౧ మొర్రిలోకసంపదలకు - విర్రవీగనేల।
కర్రకందరానిపండ్ల - కర్రుసాచనేల।
వెర్రికి గారడిసుఖమ్ము । లిర్రికెండమావులవలె।
జర్రునగల్వించుగల్మి - బుర్రనూటి జెంజోటి ॥సు॥

సీ. నిరుపేదలకుగుక్కముఱికిసంతానమ్ము కోటీశునాలికిగొడ్డరికము
చేతనైనకురూపిజేరనీయదుచెల్వ యందకానికిలోనియయంగుసున్న
మృష్టాన్న మారోగ్యహీనులకుండును దినగలవారికి దిండిలేదు
దాతనుమంగాళ్ళ దన్నియేగెడుకల్మి కడులోభివానినిగౌగలించు
ఉన్నవారున్నదనియేడ్వ నుర్విలోన
లేదనుచుగుందెదరు సిరిలేనివారు
చూడనీలోకమంతయు శోకహతము
సత్యము దయగల్గిన జనము తప్ప.

ఉ. ఎన్నగగోరనప్డు లభియించును సంపద రాణిబొమ్మకున్
సన్నుతపూజమాసిక్కి జెలుచం దనుగోరిన రాదు లచ్చి బల్
చన్నులుమాసకమ్మకటు చావకతీరని గూనివంపులా
గన్నది స్వేచ్ఛలేనిబ్రతుకోజనులార యికేటిసౌఖ్యముల్.

### నాధనామక్రియ - త్రిపుటతాళము.

ప॥ భళివృధాయీవట్టియాశా - భంగమౌసంసారంబు ॥భ॥

అ॥ పలువిధంబులరక్షజేసిన - దెలియదాతనువులేమగునో ॥భ॥
మి॥ కలలోనిమాడ్కి మనబ్రతుకునగ - లుగునెల్లపనులవశములయి
యెలమిమూఢులహంకరించెద - రెట్టింతరాయబారమట్టుల॥
౧ బూరుగుపువ్వుచందాన - మోసబుచ్చుమనదు తెల్వి।
చేరవచ్చుననిపించి - దూరమౌమనకుసంతుష్టి।
ఆరయజర్వితచర్వణముక - టకటయూకదంపుమనబ్రతుకు।
కోరదగినదిలేదిటమిగుల - ఘోరదుఃఖంబనాధనామక్రియ ॥భ॥

సీ॥ జ్ఞానసంగతియటుసంసారమిదిసౌఖ్యమూమీదబహుళదుఃఖాకరంబు।
పానకాలరాయనిబలుతప్పివలెను భోగేచ్ఛ యెన్నటికి శాంతించపోదు
ఆకాశమందునల్పుటు తన్నైపై బాంధవప్రీతిగల్గుటభ్రమకృతంబు
ఎనుముతోకంబట్టియీతకుదిగినట్లు క్షోణీపతులనమ్మిగొల్చుచుంట
అనుచుఱూఢిగదెలిసి సత్యంబుదయయు
గడిమిదప్పక ధర్మార్థకామములను
పరహితంబుగసల్పెడి భాగవతులు
సంతతానందపదవికి సాగుచుంద్రు.

చ. జగమిదియెల్ల కల్లనుచు సత్యదయల్నిరసించి జాతులం
దెగడి కులానుబంధనముదెగ్గించి సదా వివిధాన్నపానముల్
దగిలి సమస్తభోగములదత్పరులై కడుదానధర్మముల్
పొగరునమాను నాస్తికులబోధలు భాగవతుల్గణింతురే॥

కాంభోజి - రూపకము.

ప॥ అద్వైతముకలదా నిద్రా - శననిధువనపరుల।
అ॥ అద్వితీయవస్తువునక - హంకృతికలదా।
మి॥ చిద్విలాసుడఖిలజగ - త్సృష్టిస్థితినాశయోని।
యద్వేషణుడాదిగురుం - డాదిశక్తికింగాక ॥య॥
౧ పరులకొరకునమ్మహా - వాక్యములనుబోధించు।
కరణిదాముచేయగా - గలరెమెట్టవేదాంతులు।

## సావిత్రీచరిత్రము.

ఎరుకగల్గువారమనుచు - నొరులదెగడితమతప్పుల।
నరయలేరు క్రిందినల్పు- నెరుగఁగలదె కాంభోజ ॥య॥

సీ. దుర్జనసహవాసదోషంబునం దొల్లి నఖిలదుర్వ్యసనంబులభ్యసించి
మానజాలక నభిమానంబునన్నిండెపాలయ్యు మరిసిగ్గుపడక ముదిరి
పరవశులై యెల్లపాపంబుల నిరాశపడిసల్పినవయస్సెల్లపాడుచేసి
తమవలె దుష్టవర్తనలేనివార లొకర్లు లటంచు సజ్ఞానులనుచు
మెట్టవేదాంతులై చెడుగొట్టులెల్ల
వర్ణధర్మములొల్లక వావివరుస
లనక విహరించి నాస్తికులగుచు నరక
మరుగుచుందురు చెనటుల గురువులగుచు.

క. సూనృతము పల్కవలె దయ
బూని సకలజంతువులను బోషించవలెఁ
శ్రీనారాయణ పాద
ధ్యానంబున జొక్కి భవము దరియించవలెఁ.

### ఖరహరప్రియ—రూపకము.

ప॥ భక్తజనులతో సఖ్యము- వసినిదు నిహపర సౌఖ్యము।
అ॥ ప్రాక్తనదుష్కర్మములెడ- బాపము ముఖ్యము ॥భ॥
చ॥ శక్తికొలది నుపకారము- సల్పుచు దీనుల బెంచుచు।
ముక్తిమార్గములగు సత్య -మున్ భూతదయయు గల్గిన ॥భ॥
౧ సలలితస్వీయవర్ణాచారంబుల వదలబోక।
కలనైనం బరభామల- గలియఁగ రాక।
ములుచలసహవాసము న- వ్వులైనం జేసికొనక।
యిలలో సర్వసమత జరి- యించెడి ఖరహరప్రియ ॥భ॥

సీ. స్వర్గములో నరంభాభోగమిట బహుమానము గొనయజమానుఁడొకఁడు
దక్షిణకై బకధ్యానమ్ము సల్పుచు బండితమ్మన్యుఁడౌ బ్రహ్మయొకఁడు

సకలక్రియలఁబృథగ్జనములనియమించిదంభుఁడై తిరుగునధ్వర్యుఁడొకఁడు
కడుపుఁగూటికై కముఁరుకంపునకోర్చి యుక్కిరిబిక్కిరౌహోతయొకఁడు

శ్రుతులసారంబుదెలియక క్రతువులందు
బశువులంజంపి సౌఖ్యమల్పంబుగొందు
రుచితమెఱుఁగక నిదియెవిధ్యుక్తమంచు
క్రూరకర్ముకుం దయదూరముగద.

సీ. మొగినహింస్యాత్సర్వభూతానియని శ్రుతినాదరింపక పశుమాంసభక్ష
ణమునట్టియధమమంత్రానుసారంబుగ నలనీచకులము లెల్లమ్రొరకు
బలుకుచ్చుతెఱఁగున బండితమాన్యులై విప్రులమంచును విర్రవీగి
జన్మంబునం జేదజంతువులంజంపు కటికవారలకును గలదెముక్తి

ఉపనిషత్తులు శ్రుతికాంత కూర్ధ్వభాగ
మందహింసను స్థాపించునదియెమోక్ష
కనుడధఃకాయమాపెకు గర్మకాండ
మౌని పశుహింసఁజెల్లు నపానమచట.

గీ. చెరుకుతీపియునగ జేరియడ్డానిని
వేళ్ళమోయ నమలు వెడగుపగిది
వేదవాక్కులెల్ల విధులని పశుహింస
సలుపు కూళ భోగములనుగోరి.

సీ. యజ్ఞము మోక్షదాయకమగు పశుహింసవిధిచోదితమటన్న వేదవాక్కు
లన్నియు దానమ్మియజమానుడెంతయు సాహసధైర్యవిజ్ఞానములను
మానవులనుబట్టిమరియూపములగట్టి ముక్కుసెవుల్నోరుమూసిచంపి
వపదీసియగ్గిలోపల వ్రేల్చితాఁగూడ నంత్యహోమంబుగానగ్నిలోన

బడిమృతింబొందవలెనని నుడువుశ్రుతుల
జెనటులిప్పుడలక్ష్యంబు చేసితముకు

ప్రాణములు బెల్లమని సోమయాజి పేరు
లొందమేకల గోయుచు నుందురకట.

గీ. క్రూరులై మాంసముం దిను కొంటెబుధులు
పశులజన్నంబులం జంప వలయుననుచు
శ్రుతులనేకొన్ని బన్నిరి చూడదొల్ల
నుండి యవివేకులటు చేయుచుండి రహహా.

మారువ — చతురశ్ర

ప॥ సత్యదయలబోగొట్టు మనుష్యుల-జముడూరక పోనిచ్చునా।
అ॥ నిత్యము ఘోరనరకమును బూని-నిఖిల బాధలం బెట్టును గాని ॥స॥
చ॥ అత్యంతకృపాసముద్రుడై నీ-లాచలమందవతరించు బుద్ధుడు।
ప్రత్యహమునా స్థిరోత్సవ యూ-పరయని బోధింప వినక పోగరున ॥స॥
౧ అరయనాత్మవత్సర్వభూతాని-యః పశ్యతి స పశ్యతి యని।
కరము ఘోషించు భగవద్వాక్యము కారణంబు బెడ చెవిబెట్టదరా
ధరణిలోన భూతదయ లేని యా-నరుని యందుగల్గు నితరధర్మము
పరికింప వృథా నీల్లేని చెరువు-చెరువ సేలరి త్రగామారువ ॥స॥

సీ. ఉత్తములగువారలుర్విలో దలిదండ్రిమాటలకుంజవదాటలేరు
పెద్దలబోడగాంచి వినయంబుగన్పర్తు రార్తులకు న్హితమాచరింత్రు
కలనైన నవ్వులకైన గల్లలువల్క రొరులగొప్పంజూచి యుల్కరెప్పుడు
ప్రాణిహింసను జేయ రేనెవంబుననైన దమకులాచారము ల్దప్పబోరు
వ్యభిచరించరు కొనరు దుర్వ్యసనములను
జ్ఞానులవుదురు సోమరుల్గారు గర్వ
మందరు బ్రతికెదరు స్వకష్టార్జితముగ
నీశ్వరుని గొల్చి మాని భజించుచుంద్రు.

ఉ. ధాత్రినిభర్తకున్మరియు దక్కినబంధులకు న్మహాయశః
పాత్రత గల్గజేసి యిరువంకలవంశజనంబులం దిహా

మాత్రసుఖంబులన్నిలిపి మోదముగాంచినపుణ్యసాధ్వి సా
విత్రితలంపువచ్చు సరవిన్సుజనావళినెన్ను నామదిన్.

గీ. పున్నెపుందంపతులలోన వన్నెకెక్కి-
పుడమిసావిత్రి సత్యవంతుడును మిగుల
నిఖిలసాధుజన స్తవనీయులగుట
వారిచరితంబు పల్కెదవాసిమీర.

మంజరి — భైరవి

తొల్లిమద్ర దేశమునకువిభుడై దొడ్డనృపతియొకడుండెన్
వెల్లసిగ నశ్వపతియనునాతని పేరుజగంబుననిండెన్
ఉత్తమక్షత్రవంశజుడాతం డురుశౌర్యధైర్యధనుడు
నౌత్తర్యుండు మహావిభవయుతుం డఖిలనృపులందుఘనుడు.

సీ. పేదసాదలనెల్ల వెదకివెదకి తల్లిదండ్రులవలె మేటిదయనుబ్రోచు
నవివేకమునవివిధాన్యమతస్థుల నిరయభాజనులని నిందసేయ
డేజీవమునకైన హింసనొనర్పడు సకలభూతములందుసమతబరగు
కలనైన దబ్బరపలుకడు మరి యేకపత్నీవ్రతుడుదీనబాంధవుండు
మచ్చునకునైన నేమహామహునిరాజ్య
మునను మాంసాశనులు త్రాగుబోతుజనులు
లేరొ వ్యభిచారులుంగానరారొ యట్టి
యశ్వపతివంటి రాజెన్నడైనగలడె.

క. అడిగిన లేదన దర్థికి
బుడమిన్ శరణన్న శత్రువున్ గాపాడున్
గడుమంచివా డరికిలోం
గడువ్యసనములబడ డట్టిక్ష్మాపతిగలడే.

క. ఎంతయు విభవముగల్గియు
గాంతామణితోడ జిరము కాపురమునదా

సంతోషించియు, దుదకు
సంతానము లేక యతడు జాలిబడెనిటులే.

వసంత — చతురస్ర.

ప॥ కాలము వ్యర్థము - గా గడుచుచుండె।
గటకటా సంతతి - గాంచనైతినా॥ కా॥
అ॥ చాలబిత్రు కులము - సంతసిల్లగా న।
సాగు టెటు మద్వంశము - జగమందున।
చ॥ హాళింగొడుకు లేనినా వైభవ - మడవిగాచు వెన్నెల చందమాయెను।
నేలగొడ్డు బ్రతుకు నాకింక నే - నిహపరంబులకు దూరమైతినా ॥ కా॥
౧ కొడుకులు కూతులు గోడండ్రల్లురు - గడునింటి నిండగల ధన్యులు।
పుడమిం దోలిటి పుట్టువందెపుడు - తడబడి చేసిన తపమెట్టిదో।
యెడతెగని యీ చింత నాకంటె నిల్లాలికెక్కుడు గదా శివ శివ।
కడకు నలుగురిలోన నవ్వులాయె - కాపులేని మాయావనవసంత ॥ కా॥

సీ॥ కొడుకు లెందరటంచు గ్రొత్తవారెవ్వరైన నడుగ నేనేమని నుడువువాడ
నడుగులు పెండ్లిండ్లు బుడుతలకొనరించు చుట్టాల నేనెట్లు చూడగలను
సాలంకృతముగ కన్యాదానముం జేసి యీ మేను దరియింప నోమనైతి
నాకు గల్గిన విద్య నా రాజ్యమంతయు నెవ్వానికిక నప్పగించగలను
కడుపు ఫలియించకుండుట కారణమున
నెంతయున్నంత చే కృశియించుచున్న
ప్రాణనాయిక నెటు సమాధానపరతు
నేను బున్నామనరకంబు నెట్లు గడతు.

మంజరి — మారువ.

అనుచు జింతించి తమకుల దేవత - యైన సావిత్రిగూర్చి
యనశనవ్రతుండై తపమొనర్చె - నఖిలశ్రమలకునోర్చి

అంతగొన్నాళ్ళకతనిప్రేమాలబ్ధ-త్వత్కృపమయ్యెనొకరాత్రి
వింతగాగభక్తులపాలికల్ప-వృక్షమైనసావిత్రి.

సీ. చేమంతిపూవుగశీతాంశుగీలించి యొప్పుగ గగనంబుకొప్పుబెట్టి
తారలన్ముత్యాలచేరుచుక్కసమర్చినుదిటిపై సూర్యుడనొప్పుబొట్టుదిద్ది
చంద్రోయిగా మేరుమందరములజేర్చి జలధితరంగముల్వ్రేళులుఁజేసి
రోమావళిన్వ్యసస్తోమంబుగావించి ఘనజఘనముభూమిగానొనర్చి
తనయఘఃక్కాయ మఖిలపాలాళమగుచు
నశ్వపతిజ్ఞానదృష్టియం దవతరించె
విశ్వరూపంబుతోడుత వేదమాత
పాలితాశ్రితవర్గ సువర్ణదుర్గ.

క. అంతటనశ్వపతియు మే
నంతగగుర్వొదుమగ ప్రమదాశ్రులొదవగా
సంతోషాద్భుతభయముల
నెంతయుజగదీశ్వరి న్నుతించెనిటువలెన్.

కేదారగౌళ — చతురస్ర

ప॥ ఇంతభక్తవాత్సల్యమునీకే-యెంతయుదగునమ్మజగదీశ్వరి॥యి॥
అ॥ సంతోషించితినేటికినాదగు-జన్మముదరియించెనాహాయమ్మ ॥ఇ॥
చి॥ ఎంతటివారైననీదుమహిమగ-సింతయుదెలియగలరెయాదిశక్తి
యింతకునీదయలేకనిన్నుగన-నెవరితరమెతల్లిత్రిపురసుందరి ॥ఇ॥
మపనిధపమగరి తారితకటర్ఝణు । నిసరిమరిమపనిత ఝుంతధిమిగధి
సరిమరీఝణుత ఝుంపనిధమ ।తకదధిగిణతతదధిగిణతదధిగిణత॥ఇ॥
౧ ఇలలోనినుగాంచునతనికిం-గలలోనైనగలదెయఘము ని
టలలోచనీభవమోచనీ-భళీయధరజితబింబజగదంబ।
కలుషహారిణీశోకతారిణీ-కాళీచంచరీకచికురాళి।
పొలుపుగనాప్రేమదీరునటునిన్-బొగడగలనె శ్రీకేదారగౌళ॥

నిధాపనిధపాధమ పమాగరి । తరికుంకిటతరికుంకిణాంతకుందరి ।
పనిసరిమామామగరిస। పాపాపపమగరి సాసాసాధ । తళంగుతక
దధిగిణతోం-తళంగుతకదధిగిణతోం-తళంగుతకదధిగిణతోం ॥౩॥

సీ. కంటికిరెప్పట్లుకడుజాగరూకతం బిల్లలగని పెంచుతల్లివీవు
అన్నదమ్ములగనిపెన్నిధులని కూర్మిలెక్కించు సకచెల్లెండ్రవునీవు
నాయమ్మనాయయ్యనాకన్నవారని గొబ్బునప్రేమించుకూతువీవు
ప్రాణంబులన్నియు భర్తకర్పించి యిల్మర్యాదకాపాడుభార్యవీవు
కార్యహేతువులీవు జగమ్ములీవు
నీవెయంతయు నెద్దియుంగావునీవు
నీదుతత్వంబు దెలిసి వర్ణింపదరమె
యాశ్రితజనార్తిభర్గ మాయమ్మదుర్గ.

కేదార—రూపకము.

ప॥ నిన్నువినా దిక్కెవరే - నిఖిలలోకజననీ ॥ని॥

అ॥ కన్నుకరువుదీరగనిను - గంటినెంతధన్యుడనో ।

మి॥ ఎన్నగహరిహరాదిసుర - లీవాశించెడిబొమ్మలు
నన్నునీదుదాసునిగ న - నారతముంగాపాడుమ ॥ని॥
పప్పమగమ్మ గరిగ్గరిస - రిసనిన్నిపసా నినిసాసరిగమ ।
సరిగమగరిసని పనిసరిగమగరి- నిసరిగమగరిస సనిరిస గరిసస
తద్ధిగిణత తద్ధిగిణత తద్ధిగిణత॥ పైకాలము.

౧ నీదయగల్గినవారికి - లేదసాధ్యమెందైన ।
నాదిశక్తినీభక్తుడె - యవ్యయానందమందు ।
నాదైవము నాతల్లియు - నాసర్వము నీవె నిర
మోదముతో బూజించెద బొగడెద శివకేదారమ॥ని॥
(పైకాలము) సపపామగమగ రిమమాం గరిగరి సగగారిసరిస।
నిరిరీసనిసని పసపానిపనిప నినీపసపానిరిరీసగరిమగారి।

సాస్సనిధప నిస్నిధపమ దాద్దపమగ పాప్పమగరి।
తాకిటతక తరికిటతక తోందధిగిణత ॥ని॥

దండకము.

జయజయజగదంబ నీలాలకస్తోమరోలంబ దంతచ్ఛదస్ఫారబింబా కసత్త్రైసకతోద్యన్నితంబా సదానమ్రసర్వామరోద్దామరత్నౌఘకదంబా స్వభక్తావలంబా నినుఁ స్తోత్రముఁ సేయ నేనెంతవాఁడన్ భవాంభోధినిర్మగ్నుఁడన్ మూఁడులోకంబులన్నీవె తల్లీ భవన్మాయచే స్వప్నమందెట్లు చిత్తంబునన్ లేని విశ్వంబు సత్యంబుగా దోచునో యట్టుల న్వొండియు న్నీటిలో బుబ్బలెట్లుబ్బుచు న్నొగ్గునన్ నాశముం జెందునో చూడ నీయందె యాతీరుగా నీజగజ్జాలముల్పుట్టి గిట్టున్ మరి న్నామరూపంబుల న్భేదముంబొంది నానాఘటాకారతన్ బొల్చుచున్నట్టులో దేవి యీజంగమస్థావరద్వైతభావంబుగా విశ్వరూపంబున న్నీకు నీవే విలాసంబునన్ దోచినట్టుండియున్ నిత్యభూమస్థితిన్ సచ్చిదానంద తత్త్వంబుతో నున్న నీయద్భుతాఢ్య ప్రభావంబు నూహింపనెంతేసి వాగ్వైనసుం జాలరోయమ్మ నేనెంతవాఁడన్దలంపంగ నీభక్తులౌ వారికీవేసమస్తప్రపంచంబుగా దోచుచున్నావు నాతల్లి నాతండ్రి నాసర్వబంధుస్వరూపంబు నాలోకము న్నాదు దేహంబు నాజీవము న్నీవె నీకన్న వేరున్నదే నిన్ను నేనెంతవర్ణించిన న్నాదు ప్రేమంబు కాసింతయుం దీర దే నేఁడు నేతుంమహాదేవి నీలోననం జేర్చుకో యేలుకో నన్నునీదాసునింగా ద్వరన్ వేదమాతా నమ స్తేనమ స్తేనమః॥

చ. అని వినుతించు నశ్వపతి కంబ ముదంబున నోయివత్స నీ
యనఘతపంబు మెచ్చితి మదంశమునంజనియించు నీకు ది
న్నని యొకకూతు రాపెపలనం దరియింత్రిరువంకవారలెం
దున జయమబ్బు నీకనుచు దుర్గ తిరోహితయయ్యె నయ్యెడన్.

మంజుగతి—జంపోటి.

అంబదయనందియశ్వపతియుగా - హృదస్థ్వమ దంబుననొప్పెన్
ఇమ్మగగొన్నాళ్ళుజరుగనాతని - యిల్లాలున్నెలదప్పెన్

చుట్టపక్కములుసంతసపడనా - సుదతిగర్భము ఫలించెం
నెట్టనమంచిముహూర్తమందునా - నెలతకూతురింగాంచెఁ.

గీ. తల్లిదండ్రులమోద మెంతయును హెచ్చ
బిల్లనానాట హాయిగ బెరుగుచుండె
బున్నమి సావిత్రీవ్రతమున బుట్టెగాన
వెలది సావిత్రియను పేర బిల్వబడియె.

కీరవాణి—రూపకము.

ప॥ దానివయసు చక్కదనము - దరమావర్ణింపగ నల ॥దా॥
అ॥ చానలలోమాముద్దుల - సావిత్రికిసాటిగలర ॥దా॥
చ॥ మేనిచాయముంగురులు - న్మెల్మిబంగారునిరులు।
కానొప్పుచిన్నపిసికెడు - కందోయిపెద్దచేరెడు ॥దా॥
౧ కమ్మతేనబావియ - క్కావిమోవితీవి।
జుమ్మావయ్యారిమోర - చూపుమరుకటారి।
ఇమ్మెయివర్ణనచాలు - నెందుకుగోటివిధాలు।
నమ్మవలయుద్రిపురసం - దరియెయక్కీరవాణి ॥దా॥

సీ. అఖిలకళాప్రౌఢనందియుసుంతయుంగర్వంబుదెలియనికమలగంధి
జగదేకమోహన సౌందర్యఖనియయ్యు నద్దముచూడనిముద్దరాలు
ఒగిరాజకూతురయ్యునుభృత్యులన్నిరసనముచేయనిశుద్ధసత్వమూర్తి
అతిసుకుమారాంగియయ్యునార్తులజేరి పనిబూనిరక్షించునెనరుకుప్ప

దానమువ వేల్పుటావు సత్యమ్ముప్రోవు
మెరుగుమరుదంతి కల్కులమేలుబంతి
శీలవుంగొట్టు ఖలులకు జెంపపెట్టు
ఎలమిసావిత్రి కెనగలదే ధరిత్రి.

మంజుగతి — భైరవి.

పోలతికిదగువరునికై యశ్వపతి- భూవిభులబరీక్షింప।
గులరూపవయశ్శీలములనాపె- కున్సరిలేరుదలంప।
తమపటములనంపించు చెందరో- ధరణీవిభులుతల డిల్లఁ।
సమాధానపడ కా పితండ్రియా- జాలకుండెతనపిల్లఁ।
అంతదనకునను కూలపతి యెట్టు- లబ్బుననుచు సావిత్రి।
చింతించుచు గలగాంచెసిటాను- స్నిగ్ధగాత్రి యొక రాత్రి॥

సీ. బిరుసునీలంపుటుంగరములవలెనునంగురులు పెన్నొసటిపై గునిసియాడ
ఆలచిప్పలబోలు వాలుకన్నుంగవ కొనలవెంబడిమంచి నెనరుజింద
ముప్పిరిగొన్న మేల్పుత్తడిమూపున బెళితంపుగండ్రగొడ్డలి వెలుంగ
మోము చందురునందు మొల్కమీసలుకప్పు చిరునవ్వువెన్నెల చెలగు
చుండ। తల్లిదండ్రులు ముసలిముద్దలు గలిగిన
నెత్తలనొర్మియుగంపను నేలడించి
జుంకపూడించి తీయపండులను జలువ
నీడదినిపించు నొకరాచకోడెకాని.

ఉ. కాంచినయట్టులెంతయును గారవ మొప్పఁగ బ్రాణనాయకీ
మంచిమరందపానమిడి మామకునత్తకుదృప్తిచేసి క
ల్పించుముపూలపాన్పు మరివీచుము చల్లనిగాలి నేను గా
వించెదపాదసేవ యనుచింపుగ నాతఁడుపల్కినట్టులుఁ.

క. తానుంగూడ నతసిదన
ప్రాణేశ్వరుగా దలంచి భయభక్తులతోఁ
బూనితదాజ్ఞ సలుపుచా
లోనిద్దుర మేలుకాంచి లోలేక్షణయున్.

గీ. తనకు గలలోన నాధుడై తారసిల్లు
నతసిహూపంబు పలుమరునచ్చుపడగ

చిత్తమందునతలపోసి క్రొత్తవలపు
తత్తరంబున జిగురింప దలచినట్లు.

నాటకురంజి — రూపకము

ప॥ జాణనీవేనానాథుడవై తివింతేసుంజీ ॥జా॥
అ॥ కాననముసనాకలలో-గన్న పెన్నిధానమా॥జా॥
చ॥నీనగుమోము పసందు-నిక్కపుచందురుడందు।
నీచిరువాలుకందోయి- నెనరుజిందుశాబాషోయి॥జా॥
౧ అందమైననీదుమోవి- యందగలనోకో।
కందోయికరువుదీరనిం-గందునప్డాకో।
సందిటనిన్బిగియించి సరసములాడదలంచి।
యందెవతేయుండెగొంజి-క్రిందీనాటకురంజి॥జా॥

సీ. నీదగుపితృభక్తి నీసుధర్మాసక్తి నీసత్యమధురోక్తి నీకుదగును
నీవాలుకందోయి నీపంచమస్థాయి నీచిరునగుహాయి నీకుదగును
నీసింహమధ్యమ్ము నీజ్ఞానవిభవమ్ము నీదుబాహుబలమ్ము నీకుదగును
నీపెన్నుదుటియొప్పు నీయురమ్మునవిప్పు నీదునొక్కుకొప్పు నీకుదగును
చక్కదనమును బరాక్రమసద్గుణములు
నలువ యందునె పరిపూర్ణముగ జేసె
భళిరనీవంటి యుత్తమభర్తగల్గు
రమణియేజుమ్ము త్రైలోక్యరాజ్యలక్ష్మి.

ఉ. ఎందుకునిన్నువంటిజగదేకమనోహరమూర్తి నాకలన్
బొందుగదోచి నాదుమనమున్వడి దొంగిలిపోయెనక్కటా
యెందుకుతెల్వివచ్చె నినునెట్టిక కన్గవవిందుగాగ గన్
గొందు ననంగుడేయు పువుగోలల కింతటివాడియున్నదా.

గీ. అంత సర్వకలావేత్రియాటదాను
గలనుగాంచిన యాయందకాని జిత్ర

పటమునన్ వ్రాసి సావిత్రి బాగుమీర
తనదు చెలికత్తెతోడ నిట్లనుచు బలికె॥

ఆనందభైరవి — త్రిపుట

ప॥ ఇతడెవ్వడో కాని- యింతీనిన్నాళలలో।
నేగుదెంచినవీరుడే- మారాకారుడే॥యి॥

అ॥ అతివరోనన్దనయి- ల్లాలిగభావించు ద।
యార్ద్రకోమలచిత్తుడే- ధీరోదాత్తుడే॥యి॥

ది॥ అతివృద్ధులతలిదండ్రులసి- యంధకాదకటజాత్యంధుల।
సతతము ఘోరారణ్యములో- సంరక్షించెడిమహానుభావుం॥డి॥

౧ ప్రాణనాయకీచేరరమ్మనినను బిలిచి।వలసిసందిట గ్రుచ్చె నే
ముద్దులిచ్చె నే।పసుబులకరించియేమని యుండగ-నెంతోవింత
కుడాసెనే యేమోనేసెనే।వీనిజూడకున్నాయుసురు-వీసమైననిక నిల్వబోదు
తానేమితలచెనోమత్కుల-దైవతమగునానందభైరవి॥య॥

సీ॥ మొకరితుమ్మెదలనారోచిసినయట్టులు ముంగురుల్ నొసటిపై ముద్దులూర।
తెలిదమ్మి రేకులదెగడు వాల్గందోయినెమ్మియునోరుపు నెనరుదెలుప।
పలుచాలు మల్లె మొగ్గలు చివుర్వాతెరకాగ్లింపమ బవిరిగడ్డమమర।
కుంచపు మొదలటుగొప్ప మెడయు బెద్దతలుపువలె గ్రొమ్మ తనరుచుండ।
భళిరముంగాళ్ళదాటు చేతులునుమరియు
నడుముసికిటనిముడు కుందనపుచాయ
యొడలు తిన్ననియేరాసియొడ్డుపొడవు
ఆడదేమితనికి మగవాడెవలచు.

సీ. కందున్నపున్నపు చందురుగాదంటిమో వీనిమోమున కుపమయేది
యబ్జముల్యాడునటన్న నిక్కందోయికగునెచ్చట నిదర్శనాతిశయము
పన్నుతొండమ్ములిస్సీవంకలనవీని హస్తమ్ములకునుదృష్టాంతమున్నె
మరియనంగుండగుమరునికితనితోడ సకియరోసుంతైనసమమదెట్లు

సహజసద్గుణ సౌందర్యశాలికైన
సతతదోషాధిక కురూపయుతునకైన
చానయెందు కలంకార శాస్త్రగరిమ
యింక నీయందకాని వర్ణించుటెట్లు.

మ. నెలతా నిక్కముగా నితండు కలడేనిన్ వీనితో నాకు బెం
డిలియా వేగను తప్పకుండునటులన్ సిద్ధింపకున్నన్ బరున్
గలనైనన్ వరియింపజాలను మరిదుర్గాపాదపంకేరుహ
మ్ములు చింతింపుచు భక్తియోగమున నే మోక్షంబు సాధించెదన్.

మంజరి — జెంజోటి.

కావున నిప్పటము నాతండ్రికి నప్పర్చి నీవు వేగ
నావిధము దెలిపి యాతని వేడుకం బంపుము తమ్ము యెలనాగ
అనగనా పెచేటికత్తె యశ్వపతి కత్తెరగున్ వినిపింప
వినియచ్చెరువశిచిత్రాకృతిగని పృథివీశుడు యోచింప
అంతసర్వజ్ఞుడౌనారదముని యచటికి దైవవశమున
సంతసమున నారాయణభజనము సల్పుచు రా వినయమున
ధరణీశ్వరుండు సాష్టాంగముగా దాపసేంద్రునకు మ్రొక్కి
కరములు మొగిడ్చి యిట్లనె జిత్రము గన్పర్చి చింతజొక్కి.

సీ. అయ్యయీతనిస్వప్నమందునా కూతురు కాంచి యెంతయును మో
హించెనకట । జాత్యంధులౌ వృద్ధజననీజనకులను గాపాడునట ఘోరకా
ననమున । నిమ్మహాత్ముడు వీనికెవరైన సాటిగారంట సౌందర్యపరాక్రమ
ములు। వీనినిదక్కరుం బెండ్లాడనని యుక్తవయసువచ్చినకన్యపట్టుపట్టె

ఏమిసేయుదు గలనిజమెట్టులౌను
ఈవు సర్వజ్ఞుడవుగద యెచటనైన
నిట్టిపుణ్యాత్ముడున్నాడ యెరుకపర్చు
మనగ జిరునవ్వునమ్ముని యనియెనిట్లు.

బేగడ — చతురస్రి.

ప॥ ఎందుకీతడు కలడుగాని యల్పజీవి॥ యెం॥
అ॥ సందియము లేదు - సత్యవంతుడితడు॥ ఎం॥
చ॥ అందమునబిస్సృనేవా - నందమునగనికారవు
డెందమునభళిభళిరణ - మందితనికిసాటిలేరైన॥ నెం॥
౧ కారడవిసాగికష్టపడుజోగి - పారుటాకుమీాదబ్రతుకుచుండు వేద।
వీరుడగుణ సాగసునవల - మారునగుణ నీసుతకెటు।
కోరదగుణ జేరిపెట్ట - జాలదు బేగడ॥ యెం॥

మ. అరయంగా నృప రాజ్యదంపతులుజాత్యంధులున్సాళ్వాధిపుల్
సరిపుణ్యాత్ములు దైవయోగమున రాజ్యభ్రష్టులై సప్తవ
త్సరము ల్గొంచినసత్యవంతుడను పుత్రశ్రేష్ఠుతోగూడ దు
స్తరవింధ్యాటవిలోవసింపవలసె స్వక్రతుల్గ్నియోగింపగాణ.

గీ. నీదుకూతురుకలలోన నిన్న గన్న
యాత డాసత్యవంతుడే యితనికాయు
విర్వదేండ్లిప్పుడందు బదెన్మిదిచన
నింకనీయిష్టమని మునియేగెనంత.

మంజరి— నాథనామక్రియ.

నరపతియుం దనకూతురుకలలో - నంగనుసత్యవ్రతుడు
పరగనికడముగనుంటకునద్భుత - పడియాబుధసన్నుతుడు
అంతఃపురమునలీలావతియును - నాత్మపత్నిచదివింప
వంతపైకిదోచనీకగారివి - వాహముచెలులునుతింప
జరుపుచున్న పుత్రీరత్నమున - శ్వపతికౌగిటంజేర్చి
ముదమునవిట్లనెదళ్కు చెక్కిళ్ళు - ముద్దుగొనియాపెగూర్చి.

గీ. అమ్మనీవుకలంగన్న యతడునిజము
వింధ్యకాననమందుండు వీరుడంట

నారదుఁడు చెప్పె సుగుణసౌందర్యములను
సాటిలేకట యితని కిజ్జగమునందు.

ఉ. ఈతని సత్యవంతుడని యెల్లరు నందురు క్షత్రబాలకుం
డాతత బాహువీర్యుఁ డనయంబు బతివృద్ధుల దల్లిదండ్రులన్
ప్రీతిని బ్రోచునీతఁడడవిన్ ఋషిమిత్రతనుండుగాని హా
యీతని కాయువింక కట యేడులు రెండట యేమిసేయుదున్.

క. గాపున దల్లీ యితనిన్
భావింపక చిరము బ్రతుకు వరునింకొకనిన్
సేవించుమనఁగ నిపుల
జ్జావిస్మయఖేదములను సావిత్రియనెన్.

భవప్రియ—రూపకము.

ప॥ మారుమనువు లేదు తండ్రి - మనువంశమున॥ మా॥
అ॥ వేరకోరతగినయట్టి - విభుడేడీయితని విడచి॥ మా॥
చ॥ ఈరాకొమరుడు ననల - నేలుకొని యుపెవితోడ।
నారయు కాపుర మొకక్షణ - మైనంజాల దేవయ్యల॥ మా॥
౧ ఎట్టిధన్యరాలనో - యీతడుంటని॥ మా।
గట్టిగనీదయుగల్గ న- కాలమృత్యువెట్లు చేరు।
అట్టులఘటనాఘటన - మధటాతినొప్పెడు దేవత।
యిట్టులనమ్మనమునలసి - కేలిడుచుమనభవప్రియ॥ మా॥

ఉ. కోరనికోర్కెగాఁగల సకుంఠితవీర్యుడు క్షత్రియోత్తముం
డారయ సూనృతవ్రతు డహర్పతి తేజుడు కోటిమన్మథా
కారుడు నన్నుఁగూడియు ప్రకారడవిన్నిజమైనయట్టి త
చ్చారుతరాయువింక కొనసాగక తీరదు తండ్రిసమ్ముమా.

గీ. కనకదుర్గయు మనపాలఁగల్గెనేని
యరయ సాధ్వీకిమాహాత్మ్య మలరునేని

యితడుచిరజీవియగుచు నన్నేలగలడు
వేఱుదువులేలతండ్రి నన్నీనికిమ్ము.

మంజరి — కన్నడా.

అనవినిధరణీశ్వరుడుందననుత - యన్యునొల్లదనియెంచి
కనకదుర్గచెప్పినదెల్లనిజము - కాకపోదనితలంచి
కూతురుందామభార్యయున్వేద - మాతపై భరముంబెట్టి
పూతయశులుబయలు దేరిరిమంచి - ముహూర్తముంబసిగట్టి.

సీ. చెవులకుజల్లగజెలగికోయిలకూసె సందడిపెంపొల్లి బాజాలుమ్రోసె
కన్నెవేపయుదోగర్గున్నసమర్తాడె జలివేంద్రదాపునసంతగూడె
కమ్మమామిడితోటకాపులపనిహెచ్చె బిల్లగాలులుమురిపించివచ్చె
గొడుగులుజొల్లెండచిమిడిజిల్లార్చెదాటిమంజులుకడుదప్పిదీర్చె

కారడవివెల్గె బడవపికారుగల్గె
సందేలింపాయె గంగిళుల్సడలిపోయె
ప్రొద్దులేపారె మాపులుపొట్టినారె
ఆమనిమొదలుపెట్టె బల్హాయిపుట్టె.

ఉ. అంతటసత్యవంతుడు మహాటవిలోనొకవేటపోతు న
త్యంతరయంబునంజెలగి వ్యాఘ్రఘనాస్యమునుంచికాచి గా
నెంతయులేతపచ్చికల నిర్భీకమేపి భయంబునాపి వి
శ్రాంతియొసంగి ప్రాణినికరంబుమోయిందలపోసెనిట్లులన్.

అఠాణా — రూపకము.

ప॥ ఎందుకింతకనికారము - డెందమునీకేమికార్య॥ మెం॥
అ॥ ఎందైనన్నిపురాజ్ఞ - నెవరితరముతప్పింపగ॥ నెం॥
మి॥ అందముగాభూతంబుల - కన్యోన్యంబాహారము।
సందియంబులేదిదిసహ - జంబుసృష్టిలోనగావున॥ నెం॥

౧ నీకునిప్పుడిగబిల్చు - నీటినగ్గితెగగాల్చు।
నారయఁ రిబలములైన - నవి రెంటఁ దగ్గఁసినిల్చు।
ధారుణిలోహింసయుదయ - కారణము పరస్పరంబు।
నూరకుండు మీర్కడుల - కున్నదిదె పనుతాణా॥ యెం॥

సీ. ఎట్టియూరకలైన జెట్టుకాయద్రుంపజెల్లవుచివుర్లు నీకక్కలేచు
ఈగలన్బాధించియంతయుగోర్కతో దేనెపట్టులడీయబూనుకొనవు
దవ్వులనుండియందంబగుపూలుగన్గొనుచుందువుకానికోయబోవు
తోడకిన్నిపై వచ్చుదుష్టజంతులఁజంపనొప్పవు నేయ్యనదప్పుకొనెదు
ఆత్మవలెనీసమస్త చరాచరముల
నెంచిప్రేమించునీకు హింసించవగిన
పస్తువెయ్యది యింకెట్లుబ్రతుకవచ్చు
గటుగటా దయకన్నను గష్టమేది.

సీ. పసిమిటికడముద్దుగునిసెకి గున్నవనదేలసాళువవేఁగయొగరనన్న
పచ్చగజివురించిబలసిన డొంకలకెగబ్రాకి మేకపోతేలమేసె
నీటియొడ్డునద్రుళ్ళి పాటబాడెనుకప్పజెట్టెసి బామేలబట్టిమ్రింగె
కొండనుండీకొనికొమ్ములనిదలించు నేన్గును సింగమదేలచంపె
ఇజ్జగంబున నన్యోన్యహింసవలన
బ్రబలుభూతంబులిది స్వభావంబుగాన
గాని ప్రకృతి విలక్షణకార్యమైన
యీకుతత్వము దయ నాకిదెట్లువచ్చె.

ఉ. జంగమజీవులెల్ల మరిస్థావరభక్షణజేసి పెద్దలు
ప్రాంగపరస్పరంబు హితము ంబచరింపుచు చావులేక సి
ష్ఠంగొని దైవభక్తులయి జ్ఞానవిభోగములన్సమానులై
రంగుగనున్నయుష్ఠు భళిరా సుఖియించెద నెమ్మనంబునన్.

క. ఈపిచ్చితలపులేల యి
మాపతియోటునినిణయించి మరియట్టులగున్

హాపరమేశ్వర యదె నా
కై పిలుచుచున్న వారకటా తలిదండ్రుల్.

శేనా — ఏకతాళము.

ప॥ అయ్యోయనుగన్నతల్లి దండ్రులారా మీకెంతవచ్చెన॥ య్యో॥
అయ్యాయనగనొకడైన బంటులేడ॥

అ॥ వెయ్యారువిధములసామంతులెల్ల వినుతిసేయ బేరోలగంబుండి।
చయ్యనసాళ్వదేశమేలుచుండు-సర్వజ్ఞులు మీకుసాటిగలరె ॥యయ్యో॥

౧ ఏమనందు దుర్విధికిసుఖ్మగా-నెల్లదెచ్చెనిచ్చటికి।
భూమిలోనబల్కించివారినే బొందునిజమెవ్వటికి।
వేమరుగానగష్టాధీనమైతిరి శేనా॥ యయ్యో॥

సీ. ఇంతటిమంచివారిట్టివిద్యాంసులు మీరుబాత్యంధులై మెలగనేల
పేరూరులేనట్టిపేదవారలుగాక మూర్ధాభిషిక్తులై పుట్టనేల
పనికిరామనియొకపట్లనుండక కటా దివ్యక్షణంబుల జగమేలనేల
దుష్టశత్రువులచేదుర్భర వార్ధకంబున నిట్టిదుర్దశబొందనేల
ఇంతచిత్రమొకో పరమేశ్వరేచ్ఛ
మిమ్ముదలచినకొలది మనమ్మునకరుగు
నన్నుబోలిన నిర్భాగ్యుగన్నమీరు
నంతమున సుఖమొల్లుండునకటకట.

సీ. స్వర్ణసౌధంబులోవలనుండువారి బందిలిపాకనివాసమయ్యె
పట్టువస్త్రంబులగట్టువారికి జెట్టులపట్టలుబట్టలయ్యె
శాల్యోదనంబుభక్షణసేయువారికెండినధూళికుంపయుదిండియయ్యె
సామంతరాజసంస్తవముపినెడివారికీయుడకారొదలాలించుటయ్యె
అనిమిషులుమెచ్చునట్టుల నెనుబదేడు
లంతసామ్రాజ్యసంపద ననుభవించి

యీమహాత్ములు తుదకట్టి యిడుమగనిరి
కాలమొకరీతి నెవరైన గడుపగలరె.

గీ. ఇట్టులారాచకోడుకు జింతించుచుండ
నంతజతురంగబలముతో నశ్వపతియు
దనదెసకు శంఖకాహాళధ్వనులతోడ
రాగనుంగొని యీప్రకారముగ దలచె.

క. మారాజ్యము గైకొని మ
మ్మీరీతింగానకనిపి యిన్నాళ్ళకు మా
వైరులు నాయభివృద్ధికి
నోరువకిటువచ్చుచుండిరో మేలుభళీ.

వాచస్పతి—రూపకము.

ప॥ ఐనగాని నేజయింతు - నవలీలగా ।
అ॥ కానలంచుమమ్మిట్టుల - గష్టములకుద్రోయువారెవ॥ రై ॥
ని॥ మానుగదపస్సుచే శివు - మన్ననవడసినదివ్యా
స్త్రానూనాగ్నిజ్వాలల - నంతకునైన్మరెవరి॥ నై ॥
౧ భళిభళితగిననమయమిది - పౌరుషముంగనుపర్చగ।
బలుతపమునననన్నుగన్న - వారిఋణముతీర్చగా
తలిదండ్రులకృపనాపై - దనరువరకుభుజబలమున।
నలవాస్తోష్పతినైన - న్లోబుద్ధివాచస్పతి॥ నై ॥

సీ. భూమిపీఠమునభంబు న్మాటివందిరిబహుశాస్త్రతతిసాక్షివహ్నిగాగ
ముకుటతనుత్రాణములనుండిదుల్లెడు రవము త్రైముల్దలప్రోలుగాగ
జంబుకస్వస్తివాచకులకుశత్రులతలలెంతయు ఫలప్రదానములుగ
గూలెడిభటహాయకుంభిభూరిధ్వనులలోలిబాజాబజంత్రీలుగాగ
బలువసంతము నెత్తురువరదగాగ
నాకబలిముగ్గులట్లు లాంత్రములు మెరయ

మరియుబహుయోజ్జరంకృతి మంత్రములన
బెండ్లిజూడుదు విన్నావటో విజయలక్ష్మి.

మంజరి—కన్నడ.

౧ తలిదండ్రులకై మునివృత్తినూని తనిశత్రులజయింతుఁ
చేఁగినాకుతొల్లిగల్గురాజ్యము శీఘ్రముగ నాక్రమింతుఁ
౨ అనితలపోయుచు జననీజనకుల కంతబరిచర్యసేసి
యొనరధనుస్తూణీరములంగొని యుటజద్వారముడాసి
౩ సత్యవంతుడున్నప్పుడు దవ్వుల సైన్యమునిచి యశ్వపతి
యత్యంతముదమునందూతురు భార్యయువెనురామందగతి
౪ జేరివీరరసముమూర్తిభవించిన యట్లొప్పు నతనిఁ
గోరియిట్లని గభీరవాక్కుల సుగుణరూపధైర్యధనికిఁ

మ. భళిరా యెవ్వడవీవరణ్యమున నీభంగిన్మహాశూరుఁడున్
గలరా పిత్రయు సత్యవంతుడట స్థానభ్రష్టులౌ తల్లిదం
డ్రుల సంరక్షణసేయు దిక్కడగలండో చెప్పుమా వానితోఁ
లగమాకుంబనియున్న దన్నృపతికిట్లన్బల్కె నవ్వీరుఁడున్.

నాట—త్రిపుట.

ప॥ శూరతనాకేదీమత్పిత్రు-వైరులపోతరమడపనియడ॥ శూ॥
అ॥ శారదవిన్నాతరిదండ్రుల-గష్టపెట్టుక్రూరులకుగాక॥ శూ॥
మి॥ వైరాగ్యమునఁ - గడుముదుసలి।
వారైకరుణఁ - జనచయసం।
చారవిముఖులఁ - బహుసాధుల।
గోరియాసజింప నిటువచ్చిన।
కుత్సితుల బారిగొనకున్న॥ శూ॥
౧ అపురాయిన్నాళ్ళకస్మదీయ - యాస్త్రాగ్ని కాహుతింభించి।
వివిధశత్రువులబరిమార్చెద - బిత్రాణమిప్పుడు నేదీర్చెద।

ఎవఁడవురా నీ వేనామూ రాజ్యము గైకొంటివా
హా నాయత్నుఁడవు కమ్మనీ - యతిశయముమూఁడునాళ్ళాటు॥ సా॥

ప్రస్రగ్ధర. కఠినజ్యాఘోషమూశాఘనకరటిఘటాకర్ణముల్వ్రక్కలింపఁ
పిఠరప్రోద్భూతదావాగ్నినిబిడపరిరాణ్ణరసాగాళిగాల్పన్
జఠరీభూతారినూత్నోష్ణరుధిరమదిరోన్మత్తభూతంబులార్వన్
విఠపల్లోన్ప్రత్రింపనస్మద్ధ్వజయుతయశము దిగ్భిత్తులన్ప్రాలవైతున్.

గీ. అని ధనుష్టంకృతియొనర్ప నతనిరూప
ధైర్యగాంభీర్యశౌర్యాతివీర్యములకు
నద్భుతామోదములఁబొంది యశ్వపతియు
నయముగాఁబల్కె నిటు చిరునవ్వునవ్వి.

శా. అన్నా శత్రుఁడగానునీకు వినుమా యుత్సాహపూర్ణుండ న్నను నిన
గన్నారంగలలోనగాంచి యిదె మత్కన్యాలలామంబు దా
నిన్నున్ భర్తగఁగోర్వవచ్చెఁగనుమీ నీ తేజప్రతేజుణ్
నన్నుంధన్యునిజేయుమన్న విననానందప్రపాయుక్తుఁడై.

మంజరి — జంఝోటి.

సత్యవంతుఁడుఁ దనదగుజననీ జనకులకశ్వపతిభూనిరాక।
యత్యుత్సాహముతో జెప్పఁగవిని యాపుణ్యాత్ములువీక।
ఎదురుగానేగియాదరించియెంతేనింగుశలంబడిగి।
పదపడియాతిథ్య మొసఁగివియ్యపు బహుమానతినేసిరకదఁగి
అంతయశ్వపతి తనమదిదేల్చిన నాసాళ్వనృపతిమెచ్చి।
యింతింగొనుమనియాత్మజునికాజ్ఞనిచ్చె మోదంబుహెచ్చ
చన్నదోయిపై గీశనిడుద వాల్గన్నుఁ తూఁపులెదదూయ।
దన్నుంగనుచిన్నదానికై రాతనయుశీట్లుతలపోయ॥

సీ. తోడఁగెనకట్టయిట్టిదుర్భరాటవినెటువాయుఁయునీము ద్దుకోమలపదాబ్జ
తలపబాషాణవితర్దికపై నెట్టులూఁ సకూర్చుండురంభోరుయుగళ

పరుషవల్కలములబయ్యెదనెటు వేసికొనజాలునిక్కచకుసుమగుచ
భీకరవ్యాఘ్రభల్లూకంబులంగని సైచుబెట్టీమృగశాబనేత్ర
క్రూరవిధియేలనీ సుకుమారగాత్రి
నెగడీనాబోటి యడవిపాలనిసికిగూర్చె
నిట్టిసర్వాంగసుందరి నెట్టులీచట
శ్రమపడంగజూడగల్గెద జాలిమాలి ॥

క. అనియాలోచించెడి నృప
తనయునిగాంభీర్యరూప ధైర్యవిభవముల్
గనిసావిత్రియు సమ్మద
వనధిమునిగి తంత్రిసెలవుపై జెలువారన్.

కల్యాణి—చతురశ్ర.

ప॥ పూలదండసత్యవంతు - భూరిగళంబందిడియెసావిత్రి॥ పూ॥
అ॥ వాలుగమేల్పూపులన్ గ్రో-వ్వాసితూపులెదందూయ॥ బూ॥
చ॥ పాలతీకుసుమజాలముందల బాలుగాగురియనాడచిక్కని।
వ్యాళిబాడమూవిచివ్రుపటగ్గి - పజ్జగోయిలయొజ్జమంత్రమున॥ బూ॥
౧ తలపమృగారవములుతూర్య - ధ్వనులజూడగా
మెలపుసనెవళ్లు సాని - మేళమాడగా॥
అలరువిలుకాడు పెండ్లిపెద్దగ - నళులుమోతదీవనలదిద్దగ।
లలితశ్రోణీసువేణి - లావణ్యగుణాతులితకల్యాణి॥ పూ॥

సీ. నలలితపాదాంబుజాతంబులందున గొందంపుతుమ్మెదకవకూడునట్లు
భాసురనిమ్నానాభీసరోవరమున గండుబేడిసజోడుగలయుభంగి
వ్రథితపీనోన్నతోరఃప్రదేశంబున ఖంజరీటము జతగట్టుమాడ్కి
కమనీయవక్త్రరాకాసుధాకరుపజ్జఘన చకోరముజంట నెనయుకరణి

ఏకముగవలపుజిగురున నెదలనతికి
సన్నిధిం జేరినకొలంది చనువుమిగిలి

రెప్పలెగసినక్రమమున గొప్పమీరి
దంపతులు చూప్కలొండొంట దారసిల్లె॥

గీ. పిదపనల్లునిచేతిపై బిల్లచేయి
యశ్వపతియును నతనిభార్యయును బెట్టి
కాల్వలై బాష్పములు కన్నుగవంజార
నొయిడగ్గుత్తికన్పల్కి రిట్లువగచి.

కమాచి—త్ర్యస్రగతి.

ప॥ అప్పగించినాముసీ - కన్నమాయొక్క పిల్ల॥ న॥

అ॥ ఎప్పుడకీగెడ్డనెనడచి - యెరుగదయ్య యోసుకుమారి॥ న॥

మి॥ అప్పాయిచ్చుకములు - కొప్పదాడినమాట।
దప్పదాజ్ఞకు మారు - చెప్పదు।
మదిగప్పునుపంతో-పిప్పదు-చెరుపుమప్పదు-సుగుణాలకుప్ప॥న॥

౧ నిన్నగంంగన్న మొదలెం - తెన్నివలచెనో ।
యన్నము పానమునదొక్కం - లైననిద్రపోదు।
ఎన్నోనోములునోచి - కన్నా మెంతయుబెంచు।
కొన్నాగుప్పుడెడయుచున్నాము - నీసుగుణము।
విన్నాము-గతియన్నాను నీవె-మన్నామదుఃఖమూవి॥య॥

సీ. కాత్యాయనీపూజకై సన్నజాజులాగోయనూయమ్మకుజేయిగందు
నొకసారిసాష్టాంగముమూకిడనూపిల్లచెక్కిళ్ళను త్రెంపు జెమటగారు
గూంత మేరనుదుర్గగుడికినడువగనూబో టియుడుంగులుపొక్కులెక్కు
హంసతూలికతల్పమైననూకూతునకొ త్తిగిల్లనపక్కలొత్తుకొనును

బలుతపంబున సావిత్రివరమువడసి
కాంచియెంతయు ముద్దుతో బెంచినార
మకటయిమ్మందయూన నీయలరుబోడి
నెట్టులేలెదొ తండ్రినీకిచ్చినాము.

చ. మరియొకమన్వి కారడవిమాటున నిమ్ముదతల్లిదండ్రులన్
గరమొటుపెంచజాలెదవు గావున మాదగురాజ్యమేలుచుం
దరిసట్రభోవరమ్ము నిను నారదుడుద్దిర సర్వసద్గుణా
కరజగదేకవీరవరుగా నుడివెం జుమి సత్యవంతుడా.

క. అనివేడు స[illegible]మామల
కనెనల్లుడు సుజనులార యాదరణము లెల్లన్
వినుడిల్లరికంబుండను
మనుమాకుంగల్లురాజ్యమునుం గయికొనెదన్.

గీ. సమయమైనప్పుడీమాట శంభుకరుణ
ననుచునోర్చిన జామాత యమునినీతి
కద్భుతంబంది తనుదనయకుఁ జేర్చి
వగచుతండ్రికి సావిత్రిపలికెనిట్లు.

(బ్యాగు) బాగు—చతురస్రగతి.

ప॥ తగునాజాలిమాలగనా - తండ్రికన్యాదానమిచ్చితరియించి॥ త॥
అ॥ మగువయెదిగినంత - మగనిసొమ్మెయగు।
మాయమ్మనీకెట్లు - మరిలభియించె॥ ద॥
౧ లోకమర్యాదయిదిసు - లోకనీయురుగనిధర్మమెయ్యదికద్దు।
నీకుకొడుకుగాక - నేనేలబుట్టితి।
పోకన్నవారల - కేకన్నెసుఖపెట్టె॥ త॥
౨ మరికంటదసివెట్టినయన్న - మాయయ్యసంజంపుకొన్నట్టిసుమ్మ
సరిగమముదీవించి - మాయమ్మతోగూడ।
సంతోషమునసీవు - జనక బాగుబాగు॥ త॥

చ. అనిధృతిజెప్పుచున్న తనయంబలుసారులుముద్దుబెట్టి య
జ్జనవిభుడెట్ట కేలకు వెసన్మదిదిట్టము సేసి వీరకా
నిని మరివీరకత్తియను నెమ్మనిగోడలి గావుమంచు ప్రా
ర్థన మొనరించి వెన్దెసబడంపడి జూచుచు నేగెదారతోన్.

గీ. అటులసావిత్రి తలిదండ్రులనుగఁ జూచి
యాత్మధృతిబట్టి తననగలనవలబెట్టి
వల్కలమ్ములు చెలిమిటివలెనుగట్టి
ముదమునం బర్ణశాల కాపురము చేసె॥

సీ. ప్రొద్దుపొడకమున్నె నిద్దుర లేచునిల్పవరించి చెర్వునస్నానమాడి
మంచినీటిందెచ్చు మామకునత్తకు బరిచర్య సేయు నాపైని వంట
వండించు నందరుబరితృప్తులైనసంతట గౌరినర్పించి ధవునిభుక్త
శేషముంభుజియించు జీరెలనుతుకు నివ్వారిసంచి విద్యాంబు శా

గుసేయు। ఆపునకుకుడితినిడు ఫలహారములను
బెట్టిగురులకు శయ్యగల్పించిహాయి
పాటపాడుచుమెల్లన బదములొత్తి
నిదపనొక కొంతరేయికి విభుని జేరు.

క. వరుని గనికందసీయుదు
మరివేల్పులభంగి నత్తమామల జూచున్
అరయంగా సావిత్రికి
సరియిల్లాలెన్నడైన జగములగలదే॥

మంజరి — మాగువ

సతితనవిభునకు నారదుడు విన మృతిరేపువచ్చుననగ,
మతినెరిగి నేటినుండియునశన వ్రతమాచరించుకొనగ।
నూనివేయిరేకుల పద్మంబులనొక వేయింటి నమర్చి।
మానుగనామసహస్రమునను మానినిబూజసేయదర్చి
అత్తమామలకు బ్రాణేశున కభ్యవహారతృప్తినడపి
చిత్తములనున్నశోకంబు బయల్వెడలకదినంబుగడపి
రేయిగూడనదయును స్త్రీగౌరీపదములబూజించి
హాయిగనందరునిద్రించువరకు సంతసేవలొనరించి॥

గీ. వెలదియడుగుల బోటమన వ్రేళ్లు మరియు
కాలుసేతుల మణుకులు నేలమోపి
మోడ్పుచేతులపై ఫాలముగదించి
గౌరికటుమ్రొక్కుసేసె గన్నీరువార.

పరజు — చతురస్రగతి

ప॥ సమయమిదెనమ్మ శ్రీగౌరి - కార్యాణిసేకన్న దిక్కెవ్వరేయ
మ్మ॥ స॥ అ॥ శ్రమబెట్టనేలనో - యమతాళజాలనే।
రమణునిమారేండ్లు - బ్రతికించినముగా।
పుమానీదె - సుమాభార - మునమా దేవి॥ స॥
౧ కేపేనామగనిజంట నా - పాపపుదైవమునా కెడపగలడంట।
నీప్రాపుగొంటినే - నిన్నెనమ్మియుంటినే।
కాపాడుమంటినే - కొంతుగరజుకాని కాంతయరజు।
వాల్గత్తిలేనిపరజు॥ స॥

మ. జగమెల్లన్ బలిగించు బెంచుమరియుం జక్కాడు నీలీల నీ
సగమౌనిర్గుణుడౌ శివుండు భవదంచత్పాదనీరేజసే
వగదాయంతమహాత్వమందిరి హరిబ్రహ్మాదిముఖ్యామరుల్
నిగమాతీతవు నిన్నుతించుటెటు తల్లీ బ్రోవుమా శ్యామలా.

మ. అకటా శోకపయోధిలో మునుగు సన్నత్యంతమున్ దల్చి నీ
దుకృపానౌకను బెట్టి యొడ్డునకు సంతోషంబునం జేర్పు నీ
యకలంకాంఘ్రిసరోజభక్తిగల నా కాపత్తు రాజెల్లునా
యికజాగేల భరింపజాల నిటు తల్లీ బ్రోవుమా శ్యామలా.

కాఫి — త్ర్యస్ర.

ప॥ కనికరము నమము వేగమె - కావుకన్న తల్లి॥ క॥
అ॥ పనివడి పూదెసరమ్మా - భక్తకల్పవల్లి॥ క॥

మి॥ ఘనశోకానల మార్చునీ-కరుణావృష్టిజల్లి।
నేడెల్లి-నెవరల్లి-పుతులొల్లి॥క॥

౧ నీదుదాసురాలగాసమరి-నీవెనాదిక్కు-జగాన।
చీదరచాలుని వాదమింకేల నే-శిశువివలపించుదాన।
ధృతిజూపి-యూరాపి-నీమూకాప్రు॥క॥

శా. పారంబెంతయు లేని సంసరణకూపారంబునన్మగ్ని నే
మూరుంజర్వితచర్వణంబుగను గర్మంబుల్గడుంజేయుచు
ఘోరాశానిలతాడ్యమానులయి యంధుగ్రాహసంగ్రస్తులై
యేకుందేలరునీదయంగొనక తల్లీబ్రోవుమా శ్యామలా.

మ. అరయన్నగ్నపయున్న సారము త్వదీయాకారముం జూచుటల్
కరముల్గల్గుఫలంబు నీనిలయమున్ గైసేయుటల్ శ్రోత్రముల్
చెరుపన్భాగ్యమహార్నిశంబును భవత్కీర్తుల్ ప్రశంసించుటల్
నెరినీభక్తియె జన్మసార్థకము తల్లీబ్రోవుమా శ్యామలా.

కుంతలవరాళి—చతురశ్రం.

ప॥ పిలచినపలుకవిదేమలుక-లలితాశ్రుతిపంజరపుంజిలుక॥పి॥

అ॥ పలుమరువాదా నేనినునమ్మలేదా-
పాలించునీదానగాదా మర్యాదా॥పి॥

౧ సరుగునరమ్మా-తరియిదెసుమ్మా।
భక్తాళి మానసమరాళి కుంతలవరాళి॥పి॥

మ. గణుతింపన్వశమా నిరంతరము భక్తత్రాణము న్గావ గం
కణముంగట్టిననీకృపాపరత వేడ్కంజంద్రహాసాఖ్యర
క్షణగావించగలేద సర్వదివిషచ్ఛత్రుల్ లులాయాసురుం
క్షణకాలంబునజంపి ముజ్జగముల్రక్షింపగాలేద నీ
ఋణముందీర్చగనేరిశక్యమగు దల్లీబ్రోవుమా శ్యామలా.

మ. భవదాజ్ఞావశవర్తులెల్ల విబుధుల్బల్మారు నీలోననీ
భువనంబుల్సృజియించుచుంబెంచు మరియుంబోకార్చునీలీల నీ
స్తవముస్సేయఁగలేక వేదములు లజ్జందాల్చు నీకన్నది
కేవలేనాదగు బాధమాన్పుటకు దల్లీబ్రోవుమా శ్యామలా.

నారాయణి — చతురస్ర.

ప॥ ఎటువనుగాచెద-వీశ్వరినీ॥ వె॥ కటకటనాదగు-కష్టము బాపి॥ యె॥
అ॥ కుటిలకుంతలినీకు మరిదయలేద।
తటుకునరావేల నీ-తాళగజాలనె॥ యె॥
చ॥ మటుమాయలుసేయకు నీవిటుమాయమజాలముతగ।
దిటముమామనవినివిని-గోటాలునన్గటాక్షము తక్కటంబుగా॥ నె॥
౧ కనుపడవా కనుగనదగదిరగ।నినునెరనమ్మితినిలఘుము నాధృతి
ఘనదావదహనసదృశమయి।నిదానముగ మనసుదరి।
కొనెదాశోకము-నిధానముగనిను-దాచితినెద-
ను దాసురాలను నారాయణి॥ యె॥

మ. సరిగాజ్ఞప్తికిదెచ్చుకొమ్ము మును నే చందాన బిల్వాటవిన్
సరవిన్ర్మామలు మెచ్చ ఘోరతపముంగావించినావో మరే
శరణిన్మందులు రాసి స్థాణునివశుంగాఁజేసి సామేన నె
ట్లరవై యుంటివొ నాకటుల్గదె తల్లీబ్రోవుమా శ్యామలా.
మ. జాలింబొందు పరాకుజెందకుము నమస్కారంబుగావింతు నీ
వేళందాసులయందునీకుగల సత్ప్రేమంబుగన్పర్ప నీ
కాలమ్మంచును నిల్లు మంచుమిక నీభారమ్మనుమ్మయ్యయో
యోగా యిట్లు లుపేక్ష సేసెదవు తల్లీబ్రోవుమా శ్యామలా.
గీ. అంతవేగినతోడనే యుత్తమాము
లకు వలయుసేవలొనరించి లలనతనదు
భర్తయొప్పటివలె సమిత్ఫలములకయి
యరుగసిద్ధపడిన వానికనియెనిట్లు.

భూపాల—చతురస్ర.

ప॥ తోడరానిమ్ము నను - గూడనాథానీ॥ తో॥

అ॥ నేడు నిను బాయరాదు - నిమసమైన విడొక వ్రతము॥ తో॥

ఉ॥ మనివినాలించు - మాటచెల్లించు నెవరుంచు॥ తో॥

౧ అత్త మామలకు సేవ- లన్ని జేసితి।
పోత్తునవారలసెలవు- బొందివచ్చితి।
సందియమేల- సత్యవిలోల భూపాల ॥తో॥

సీ. నినుజూడకుండినినిముసము దినమగు నినుజూచుదినమరనిముసమగును
నినువినకుండినినిముసము నెలయగు నినువినునెలయరనిముసమగును
నినుబల్కకుండిననిముసమ్ము నేడగు నినుబల్కు నేడరనిముసమగును
నినుగూడకుండిననిముసము యుగమగు నినుగూడుయుగమరనిముసమగు

ను। నా వ్రతము కొనసాగించు నాథ నేను
దోడినీడపగిది నీతోడనుందు
మనవిచెల్లించు నీవెంటమలయుచున్న
నెచటనైనను వినుము నా కేమికొరత.

క. అని ప్రతిమాలెడి భార్యన్
గని మందస్మితము చేసి కాంతుడు ప్రేమం
బుననాపె న్బిగికౌగిట
గొని ఫాలము ముద్దుబెట్టుకొని యిట్లనియెన్.

బిలహరి—రూపకము.

ప॥ ఇంతచోద్యమైన వ్రతమి - దేలసుకుమారశీల ॥ఇంత॥

అ॥ కాంతాయుప వాసజా - గరమ్ములిటు మేల ॥ఇంత॥

చ॥ సంతతక్రూరమృగా - క్రాంతము బహుళదుర్గంతము।
కాంతారము ఘోరశక్యము - కాదకట నీవంటికోమలి॥ కింత॥

౧ చెంగల నకు జేగురు - రంగుబూయునేలనే।

యంగననీబోటిసాధ్వి - కెక్కఱలేదొండువ్రతము।
గంగాధరుపై భక్తిం - గలిగిసర్వభూతదయచె।
లంగినదనంతవచ్చు - న్గలిమోక్షపులిబ్బిలహరి॥ ఇంత॥

సీ. దుర్భరసింహశార్దూలగజాతములు సారెకువినియొల్లసెచగలవు
భూరిఫూత్కారవిస్ఫురితఘోరవ్యాళ తతిగనుంగొనియొల్లుతాళగలవు
క్రూరకంటకసాంద్రకుంజంబులంబలు నారుసీవెట్టులనూరగలవు
లలినగాఢాంధకారములమధ్యమునన్నమూరెము త్రోవగనివెల్ల నడువగలవు

యెన్నడయినను రవిరశ్మినెరుగబోక
చెలగివృట్టింట బెరిగిన చివురుబోడి
వకట మాప్వర్ణ శాలనీకబ్బపాట్లు
చాలవా యడవింగూడ శ్రమము కేల.

క. పోనీయున్నడుగోరని
దానవు నీయిష్టమనుచు దయనీమాతో
గానన్ప కేంధనమ్ముం
దేనేగెనతండు నంతదెలతెల్లవారెన్.

నర్తకి — కాఫి.

చనిచనిముందట బలురకంబులుగ సంచరించేయువిహంగములు।
గొనబగుపచ్చికపరువులపై బెనగొను మగయాడభుజంగములు।
పలుమరుంబెదరివెఱ్ఱాచిద్రుల్ళ్ళ పరుగులిడుకారుగుఱ్ఱములు।
బలిసిపెక్కుతీరులలేడిగెలబై నల్లబడినయఱ్ఱములు।
నయముగదెమ్మెరయాటగొల్పింప నర్తనముచేయుమంజరులు।
జెయికిజెయిగొల్పినాథునితోడన్ జిరజిరదిరిగెడికుంజరులు।
వివిధజంతువులకిరవై మేడల విధముననున్న కురంగములు।
నువిదలబిగికౌగిళ్ళవీడువక యొప్పుగనెగిరెడుభృంగములు।
నానాలతలెగ్రబ్రాకిసఘనహింతాలతాలతర్కోలములు।

బూనిమిట్టలన్నెలగ్రుచ్చుచు న్మ్రస్త్రలందినెదుకోలములు|
ఉలికిమ్రియూడలపయినుయ్యేల లూగెడు గోలాంగూలములు|
చెలగిసెలయేటియిసుకదిన్నెపై జెరలాడెడు శార్దూలములు|
తేనెకై తేకుమ్రాకులెక్కి మరిదెబ్బనంబడెడి బుక్కములు|
నేనుంగుకదుపుగాంచి మిగులఁగర్జించుచున్న హర్యక్షములు|
ఎండనైన సోరనీకదట్టమై యేపుగబెరుగు వెదుఱ్పొదలు|
కొండలనడుమం దేజరిల్లు కొలకులదరి బెండు మొలిచి రొదలు|
పగగదన్నసస్పర్శమాత్రమున వ్యాధులూడ్చు పరమౌషధులు|
బురాతనముగాసమాధినుంటం బుట్టలుబలియు తపోధనులు|
జాలసనవసరంబుల గన్పర్చెడి స్థావరజంగమగోత్రములు|
నేలకవివర్ణింపలేదనుభవైక వేద్యోరుచిత్రములు||

చ. చెంగెడు సత్త్వాంతరవిశేషములంగని భీతివిస్మయం
బుంగొనుభార్యనంతయు గవుంగిటజేర్చుచు ముద్దుపెట్టుకొం
చెంసటదీర నొక్కకమలాకరతీరము జేరి కాన్గుమ్రా
కులదగు నీడనుండి తనకోమలికిట్లనె సత్యవంతుఁడున్.

శ్రీరాగము — చతురశ్ర

ప|| కాంతా కనుగొనవేయి - కాంతారము సొగసు|
ఎంతో బలుసంతోషము - నెనయించెనె మనసు|| కాం||
అ|| ఇంతీహరాంతకారినడచె - దంతి మరుసిచేమల్లెపూ
బంతియందములకుమేటిబ - వంతిసుగుణాలదొంతి|
మ|| సంతతంబుజంబూబదరీవన - సఖుజూరకరికేళరంభా|
సంతానస్వాదుఫలభోగ్యముల్|
సకలతపోధనవాసయోగ్యముల్|| కాం||
౧ ఆచెర్వునసిర్ద్రాగిన నారోగ్యము హెచ్చున్|
ఈనోదపమువరింప నభీష్టార్థముపచ్చున్

వీచుచున్నల్లగాలియెండఁ గాచునూర్యుఁడు వెన్నెలవలె
బూచుఁగమ్మపూవులిచట దోచుఁ గైవల్యానందము।
వాచామగోచరమహిమాస్పదము।
ప్రకటసత్వరాజితశ్వావదము।
నీచరిత్రమూలివిరహితాగము।
నిరతనిశ్రేయసశ్రీరాగము॥ కా॥

సీ॥ లలనయికాశ్మీరు వెలగపండ్లుచవిగొంట కెంతదూరమాయయ్యయిష్టపడును
తరుణియూపొట్టికాకరకూరదినుటకుమాయమ్మ కెంతదామనసుకలదు
పొలతియీయింధనమ్ములు పోగజేమ్మకత్తుణములో నీవంటజగునివ్చు
కలికియీతుమ్మిపూవులనాశివార్చన కాగయబెట్టిన పేరనుమ్ము
అనుచునుల్లాసమున వాసినసమస్త
వస్తువులబ్రోగుచేసెకి ప్రాణవిభుని
గాంచితనమదిలో విజృంభించుభయము
బయలుసేయక సావిత్రి పలికెనిట్లు.

మోహన — చతురస్ర.

ప॥ ప్రాణనాథయికమళ్ళిపోదమా - యదో వేళమించె॥ ప్రా॥
అ॥ నానబోకుమింక సరసులోనమ్మ - కాలసమితిచాలుపైకిగమ్మా॥
౧ కనుమునీవు కూర్చునస్తువులు మనగంపకధికమయ్యె।
మనలనొక్కజాములోనరమ్మని।
మామయాజ్ఞయిచ్చె మదనమోహన॥ ప్రా॥

సీ॥ సూర్యకాంతిసుమంబుజూచుచున్నదిదలయెత్తిచోద్యంబుగనినునివైపు
ఆహారమునకేగి హాయిగాబక్షులు మళ్లుచున్నవితమగూళ్ళకొరకు
మొదటదబ్బునసాగిపొడవగునీడలిప్పుడు క్రమక్రమముగబొట్టివారె
చల్లనిమన్నుపై జల్లుకొనుగజాండములె చెన్నొసిర్ద్రాగవచ్చె
ఇంటికిప్రనమ్ము పోదమింకేలజాల
మనగ నాసత్యవంతుడొడ్డునకువచ్చి

తనదు కణతల నరచేతులను గదించి
శివశివా యెంతతలనొప్పి జెలగెననుచు.

క. తపిత తనదు తొడ నొక భా
హువుంచి బోరగిలపడుచు నూపిరిగ్రమ్మత్రే
డవిడుచుచుండిన నాథుని
గవుంగిట గదించి పలికె గలికి యునిట్టులన్.

నవరోజు — చతురస్ర.

ప॥ ఏమి కర్మమిది నాథ మన । కేల వచ్చె నీ బాధ ॥ యే॥
అ॥ ఈమూర్ఛ నీవు కష్టపడుచుండ - నేనెట్లు భరియింతు నాకేదారి ॥ యే॥
చ॥ నామీద చూడ లేవా యోకి - సారిబల్క లేవయ్యయ్యో ॥ యే॥
౧ ఇంతమున్నై సదగ్గ లేదా నొప్పి - యిపుడిటులున్నది రానా స్వామి।
మంచువలె జలువ గమ్మి నీ కొండలు - మరి గాజుబార నేల।
కొంచెమైన వీక్షించవా నను - బెంపవా మానవరో ॥ యే॥

సీ. అమ్మ దుర్గా సంతతా శ్రితజనభయ భర్గ రక్షించుమా ప్రాణవిభుని
సత్యమూర్తిగ నేగు సరసిజమిత్రుడా సత్యవంతుని బ్రోవ సగరసమ్ము
సంకల్పసిద్ధులో సంయమివరులార మంత్రించి నా విభున్మను పరండు
అతిశయంబున బరమౌషధులార మీరాగె పీచుడూ నాదు కాంతు మీద
అక్కటకట యెవరైన నడ్డుపడరు
యేమి సేయుదు నింక నా కేది దారి
యనుచు సావిత్రి విలపింప నా పెభర్త
యున్న హా దేవయని తనయుసురు విడిచె.

క. తన కాంతుండటులొటం
గనుగొని డెందంబు పగులగా శోకాబ్ధి
మునిగి తలమోదుకొంచా
వనజేక్షణ యేడ్చె నిట్లు బండలు కరుగన్.

ముఖారి — ఖండగతి.

ప॥ హాజగదేకవీరనాథా - యయ్యయ్యో మేరుధీర॥హా॥

అ॥ ఏజాడకేగెదవో ననుగూడ నీతోడ - నిపుడు తీసుకొనిపోరా।

ఉ॥ రాజారూపనిర్జితమనోజా - రవితేజా॥హా॥

౧ నీమీదబుట్టెడాసనాథ - నేబెట్టుకొన్న దాన।
ప్రేమయంతయు మరచి నన్ను - విడనాడితివి।
యేమి చేసితి నేరము - సామి పలుకవేమి ద్విరదగామి॥హా॥

౨ నీతల్లిదండ్రులచట బలుపోరారు - నీకెదురుచూచుచుంద్రు।
ఈతీరుజాగేల జేసెదవు తెల్పుమన - మేగవలె వేవేగము।
నాతోడు సుమ్మా నీవింక - నావంక జూడకున్న॥హా॥

3 ఇందుకా నాదుకనుపచ్చి - యీపున ననువలపించితి।
అందకాడా నాదుమొర్రకొంచెము వినవ - యన్యాయమింతేల గునా।
సుందరసుందరధృతి - మందగ నిన్నేమందుర॥హా॥

౪ కారుణ్యగుణసాగరా నన్న - కటయేడిపించ నేర।
యూరకున్నావు నామీద నీకేమలుక - యొకసారి మాటాడరా।
యోరి సత్యధారి దుర్మఖారి॥హా॥

సీ. నాప్రేమగన వేమి యీపగిండని వేసితో కాదు సత్యవంతుడవు గాన
భూతమొద్దయిన నింబోదవిన దాకాదు శోదరిభూతేశభక్తుడవు గాన
సరసున సర్పంబు గరచెనా సినుగాదు నీదేహమున గంటు లేదు గాన
బడలి యుంటన్న ద్రపట్టెనా యదియుగాదు శ్వాసనిశ్వాసలుడిగెగాన

కొండనైనను బడికిటబిండిగాగ
గొట్టజాలిన పెంజగజెట్టి వీవు
క్షణములోపల దలనొప్పి సైచలేక
యిట్టులైతివి దుర్విధి కేమనందు.

పున్నాగ—త్రిపుట

ప॥ అయ్యయ్యో నాప్రాణేశా - యన్యాయమింతేతగునా॥ య॥

అ॥ చయ్యన ననుబాసి - చనెదవా నీవొంటిగ॥

మ॥ నెయ్యము లేదా నామన కెంతో - నేస్తము కాదా।

వెయ్యిసార్లు పిలిచిన బలుకవు - పెరదాననా కోపమా ॥య॥

౧ నీవుండుచోటనే - నేగూడనుందు।

నిడబాసిన వస్తు - వేడనుందునురా।

వాడిన యస్త్రనమునల - బ్రిముకనీయకిట్లు।

పాడుదైవము జేసెనా - యింత ద్రోసెనా।

జోడుమనకు బాపజాలడే - వాడైన యమాడులోకంబులు।

చూడు మెట్లువచ్చెదనో నీ - తోడనేను వేగబున్నాగ ॥య॥

సీ. అంబికాభక్తురాలో కాంతవైధవ్యమొందదనుచు బల్కుచుందు రెప్పు
డు। తలిదండ్రులకు సేవదప్పక చేసిన యాతని కపమృత్యువంటదండ్రు
పతియాజ్ఞమీరని పరమసాధ్వికి బంచభూతములు స్వాధీనములగునండ్రు
సతతంబు నీవలె శంకరు సద్బించువాడు శతాయువై నెగడునండ్రు
పెద్దలిట్టుట యవ్వారి సుద్దులెల్ల
రిత్తలై మనకిపుడ విపరీతఫలము
నిచ్చె గాలంబు గడుపగ నెవరితరము
పౌరుషము చెల్లునా విధి ప్రతిఘటింప.

మంజరి—నాథనామక్రియ.

అనిసావిత్రియు బలవించుచుండ నాపెనుంగటంజముడు।

ఘనకాలపాశధరుడై భీమాకారుండై దుర్దముడు!

కనుబడి యాసత్యవంతుడా సూత్మదేహమాకర్షించి

కొనిపోవగ నాసాధ్వీమణి వెనుకొనెనంతట వహించి।

అప్రతిహతగమనంబున వచ్చెడు నాపతివ్రతంజూచి।

యాప్రేతపురీశుం డిట్లులనియె నప్పుడు తనచేయూచి॥

### సువర్ణాంగి—చతురశ్ర.

ప॥ కూడదిట్టి లోఁబిల్లమా - తోడమానుషశరీరము తోరా ॥కూ॥
అ॥ వీడు కాలధర్మమందె నీకిక - వీనితోడబనియేమున్నదిరా ॥కూ॥
చ॥ చూడుమా వరునిదప్ప - వేడుమా వరమేదైన।
వీడుమా రిత్తపూనిక - నేడు నిన్ను మెచ్చితి సువర్ణాంగి ॥కూ॥

ఉ. నీవు పతివ్రతామణివి నిక్కముగా మముఁ బోటి దివ్యులన్
గావున జూడఁగల్గితివి కర్మవశంబున నీదు భర్త నే
డీవిధి నీ గ్గైలోకమున నెల్లశరీరులకిట్లు పుట్టువుల్
చావులు నైజధర్మములు చచ్చినవారిక రారు సుందరీ.

గీ. ఇట్లు జముఁడు వల్క నెంతయు సావిత్రి
తనకు గగనగతియు ధర్మరాజ
దర్శనంబు దుర్గదయు కతంబున గల్గె
ననుచు సంతసించి యముని కనియె.

### సావేరి — చతురశ్రజాతి త్రిపుట.

ప॥ ఇటు సేయఁదగున మాకోశంశ్రీ - యెల్లధర్మములనెలెసి దైవమ॥
అ॥ కటకటా యెంతో ముచ్చటగా - గలసిమెలసి నా పతియు నేసుంద।
చ॥ ఘటనాఘటనవిదక్షుఁడవున్ స - కలచరాచరాధ్యక్షుఁడవున్।
జటులపాతకవిపక్షుఁడవున్ స - జ్జనాభీష్టదకటాక్షుఁడవున్।
మి॥ తటమట కాదా యిదియ - క్కటికము లేదా।
మటుమాయలు పనికిరావింక నా - మగని మళ్ళి బ్రతికించి పెంచుమా ॥ఇ॥
౧ ఏమి నా పుణ్యమిల్లలోకము ల - కీశుఁడవిటు నీదర్శనమిచ్చితి।
స్వామీ నీపదతామరసయుగము:-
సకలసంశ్రితాభయకరసుభగము।
కామితమందారసంతత - శ్యామా హృచ్చోర।

ధీమహితవిచారానిగమవం - దితిజగబాధారా
తామసమేలానీకింతయా - ధర్మము మేలా।
నామనోహరుని నన్ను నెడబాప
నాయమహాయమయ్యాయియానా వే॥ ౧॥

సీ. కాంతునితోఁ నంటకన్న బతివ్రతకేకోర్కె మరియుండులోకమందు
నీయెఱుంగనిధర్మమే యెడనున్నది పతికంటెసతికొండుగతియుగలదె
తప్పకనూదితోఁ దారంబునూడ్కె బ్రాణేశునివెంట నేనేగవలయు
నదియటుండనియిక నేదైనవరముగటాక్షింప నీకిష్టమయ్యె నేని
యకటజాత్యంధులైన నాయత్తమామ
లకుగనుంగవలిమ్ము నీదుకృపచేత
కొడుకునుంగోడలింజూచు కొంద్రువారు
తవిలిముచ్చటదీరగ ధర్మరాజ.

చ. అనవినియాపెతోఁడ జముఁ డత్తకునుమామకుగన్నులిచ్చితిన్
వనరుహనేత్రచూడుమిదె వైతరిణీనది దీనిదాటగా
జనదికమర్త్యదేహులకు జయ్యనగావున యిక్పొమ్మి సి
పెనిమిటినీకురాదు మరిప్రేతముపైనడియాస లేటికిన్.

గీ. ఇటులబల్కుజముని నీక్షించియాతని
నాపవలయుబ్రశ్న నడిగియడిగి
యనుచునిశ్చయించి యాయమజనునితోఁ
నొసటకేలుమోడ్చి నుడివె నిట్లు.

దేశి — త్ర్యస్రగతి.

ప॥ కన్నతండ్రినామీఁద - గరుణసుంతైన లేద॥ క॥
అ॥ నన్నునావిభునినెడప - నాయమమా మనుబ్రోవరాద॥ క॥
ఉ॥ అన్నాయెల్లవేలుపుల మిన్నా నీకన్నదిక్కెవరన్న॥ క॥

౧ నా పెనిమిటియందగాడు - నగసమానధీరుడు।
ఏపాపమెరుగడు మ - రెంతో మంచివాడు।
కాపాడవె సకలజగ - ద్దీపదయాకలాప॥ కా॥

౨ వీసమైననాడుమగని - విరహమోర్వజాల।
దోసిలొగ్గినానునను సం - తోషపర్చవేల।
ఆసించిన భార్యనిటుల - బాసియుయ్యనాపరదేశి॥ కా॥

శా. అయ్యా నాపతియున్నచోటని యవశ్యంబుండునేగూఢ హా
వెయ్యేలాయదియట్టులుండని జగద్విశ్రాంతచారిత్ర నీ
నెయ్యంబుంగనుపర్చి పాపమనబున్నెంబన్న నెట్లుండు నిం
కెయ్యే కావుల వానికేఫలముప్రాప్తించుం దయంజెప్పవే.

క. అనవిని జముడిట్లను నో
వనితా స్వసుఖాభిలాష పాపముసుమ్మీ
వినుమిక పరోపకారం
బొనర్చుటయెపున్నెమా మదుద్దేశముగన్.

గీ. పుడమిలో నిందెయుగన్ శోకము న్భయంబు
పరమునన్నరకబాధయు బాప మొసగు
యిహమునన్నిత్యసంతుష్టి యిద్ధకీర్తి
యుప దివ్యవైభవము పుణ్యంబొనర్చు.

లతాంగి—రూపకము.

ప॥ నరకబాధపడెదిదుష్ట - నరులతెరగు వినుమా॥ న॥
అ॥ వరారోహాసరోజాక్షి - పరమపతివ్రతామణీ॥ న॥
మి॥ పరగవ్యభిచరించువారు - పలుతీరులదొంగలున్।
సరిగగూటసాక్షులున్ - జంతుహింససేయువారు॥ న॥
౧ తలిదండ్రులబెంచనియ - ధములులంచగొండులున్॥

సాంఘితతీర్థదైవము - పశులుగురుద్రోహులుఁ।
బలులోభులువడుపుసొమ్ము - వలస్త్రీతోకునీచులును
వెటితికృతఘ్నులున్మరియు - వివిధపాపులెల్లరాఁగి॥ స॥

సీ. అలనాఁడు పరభామనాశించిచూచిన వీఁడుపాపము కనుబ్బెరుకుఁడంచు
భర్తనుమఱపించిపరుఁతో సవ్వేనికళ్లాటలు బండ్లాడగొట్టుడనుచు
నితరకాంతన్గూడి చెడుమార్గ సగ్గకంబంబున నదుమాడంచు
బైకిబతివ్రతవలె నటించుచు నీపెంకెజెల్లంగొర్ర వేయుడంచు

పటుతరంబగు తర్జన భర్జనములు
వ్యభిచరించిన జనములబట్టి యిట్లు
నాదుదూతలు నాఘోరనరకమందు
చెలగితగునట్లు శిక్షలు జేయుచుండ్రు.

తరల. పలురకంబుల దొంగవారిల బట్టి కాళ్ళనుచేతులన్
గులికత్రిట్టుచు ముక్కు చెక్కలుగొట్టి మూకులు చెవ్వుల్ వాళ్లా
వాళిగ గోయుచునప్పు కారము నద్ది యుగ్రనాగాల్చినూ
దులనగన్నుల గ్రుచ్చుచుందురు తోయజేక్షణనా భటుల్.

శా. మర్మంబెద్దియు లేనిమానవులకు స్వల్పాదుబుట్టించుచున్
ధర్మస్థానములోనవారి ధనమున్వ్యర్థంబుగావించుచున్
దుర్మార్గంబున న్యాయవాది మిషనెంతో కూటసాక్ష్యంబులన్
నిర్మాణించెడు వానినాలుకల ఖండింపింతు బాపోజులన్.

సీ. పాలుచక్కెరధాన్యఫలములన్మాని దుష్టాశనులౌ మనుష్యాధములను
యంత్రవితతి నభీష్టార్థముల్పలుపక పశులబాధించెడి పాతకులను
అధికారమునసంధులై వ్యర్థముగ సేవకులనుబీడించెడి క్రూరమతుల
తమకుసంపదగోరి దైవతములకు జంతువులను బలియిచ్చుదుర్జనులను

సీ. సతతంబునిఖిల దేవతలుసన్మానింప దివ్యపుష్పకములు దేజరిల్ల
ఆకలియును నిద్రలేక రుజాజరామరణపర్జితులయిమహిమాదసరి
అణిమాదిసిద్ధులనంది త్రైలోక్యసంచార విభవమున సమ్మదించి
శాశ్వతకీర్తులై సత్యసంకల్పులై మొగిసచ్చిదానందమూర్తులగుచు
నేనుజెప్పినపుణ్యాత్ము లెల్లస్వర్గ
వైభవముజూరగొందురు పతిసదకు
నడుగుమేవరమైన నీయందుబ్రీతి
జెందితిగాన నోసంగిచిన్నదాన॥

మంజరి—సావేరి.

అనినసావిత్రి చేతులుమొగిచి యుద్దండధరునితోడ।
వనియొనిట్లుపతినొసయుబతివ్రత నౌదునెటుజగములేద।
చాయసూర్యసిలధర్మంబునిన్ను బాయజాలనల్లెను।
వేయేలక్షణంబయినసామగని విడిచిమరియుండలేను।
దీనికేమిగానివరము మరియొక దానిగోరుమన్నావు।
గానినాతండ్రియూరసపుత్రుడు గనగటాక్షించుమిదావు॥

సీ. అత్యుత్కృష్టసిత్వయమూలకారణ ధర్మరాజశశమార్తాండతేజ
సకలబ్రహ్మండాధారకమకుటాగ్రరత్నశేఖరుణి పూజితపదపద్మమోక్షసద్మ
సర్వజగద్రక్షాపసంశ్రితహృద్దీప పాశదండకలాప పాపతాప
అంబుదవర్ణసన్యాంతర్బహిఃపూర్ణ శ్యామావిలోలదయాలవాల
దేవుడవునీవె నన్నోచు దేవినీవె
నీవెసగుణుండవున్మరి నిర్గుణుడవు
భళిభళినిన్నుబాగడ నేపాటిదాన
నాకుపతిభిక్షపెట్టు నన్నన్నతండ్రి॥

క. ఈవిధమున బ్రార్థించెను
సావిత్రింగాంచియముడు సదయహృదయుడై

దేవతలుసంతసమున సు
మావలిగురియింపబల్కె యముడిట్లంతన్.

సామ — ఏకతాళము.

ప॥ వేదసమ్మతము నీచరితము సా-విత్రీయశ్వపతిపుత్రిసుగాత్రి॥ వే॥
అ॥ నాదయుంబొందిరావు నీవంటి-నారీమణియిహాపరభూషణమా
మి॥ నీదుసచ్చరిత్రవినె శుభమ్ములు-నిత్యమభీష్టసుఖంబులుగొందురు
లేదునీకుసాటిసుజగంబుల-లేరిహీనవేణిమంజువాణి॥ వే॥
౧ అమ్మానీకంటెకొమసపుత్రులు-హాయిగానూర్వ్యరలరెదరు।
సమ్మోదముతోసభలమరల-సజీవుడైనిన్నుంగూడు।
నెమ్మినినీమగడునీవుజిరగా-లమ్మసామ్రాజ్యమనుభవించియూ।
పిమ్మటశివసాయుజ్యమందెదరు-
విశ్రుతసత్కీర్తింబొంది సామ॥ వే॥

చ. అనివరమిచ్చిదండధరుడంత దిరోహితుడయ్యె నబ్బటన్
ఘనముదముంబెనంగొనగ గాంతయునెప్పటియట్లుభూమికిన్
జనితనయుంకదేశమున నాధునినెత్తలబెట్టి నిద్రలె
మ్మనఘుడజీవితేశయని యాతురతంబడి పిల్చుచుండగన్.

సీ. తొలుదొల్తగాలుసేతులుకొంచెము కదిల్చిరొప్పుగనొకప్రక్కకొ
త్రిగిల్లి। వెండియుంబిమ్మట వెలికిలబడి బొజ్జయున్రొమ్మునెగయలోనూ
ర్పుదీసి। బడలికన్నన్నుగవన్నిరుజారగ మైవిరఘుననుబిట్టావులించి
పిదపమెల్లనచూపువిచ్చియిల్లాలినెమ్మొగము గన్పడజిరునగవునవ్వి

శివశివాయంచుగూర్చుండి చివురుబోడి
యింతసేపయ్యె నను లేపకేలజాగు
చేసినావనిమిగులనచ్చెరువునంత
సంతసము ముప్పిరిగొనంగ నింతివల్కె.

తోడి—ఆదితాళము.

ప॥ జీవితేశనన్ను ముందుకౌగిట - జేర్చుకోరపై సంగతిజెప్పెద ॥జీ॥

అ॥ నీపట్లుతలనొప్పిచేబెద్ద - నిద్దురంజెందినావికేమందు ॥జీ॥

చ॥ నేవిలపించుచుంటి నంతటమరి-
నీదుసూక్ష్మ దేహముంగొని జముడు।
పోవగానిపొంబడితి సంబుద్ధతి।
బొందితిగుర్వాప్రసాద మొట్టిదో।
అభోగము. ఆవిధిదనవెంటవచ్చిన - నన్నరసియతడుమింట।
నోవనితనీప్రరాతగనుకోరు - మొసగెదనీవడదక్కవరమనియె ॥౧॥

౧ కోరుకొంటినాయత్త మామలకు - గొబ్బున జూపులు రావలయునంచు
నారియటులొసనిసయుసిసిస - సరకస్వర్గసుఖంబులజెప్పి।
నీరమణుమదప్పునరియోద్దైన - నీవడుగుకొమ్మనగనాదుతండ్రి
కౌరసపుత్రుల వేడినసిచ్చితి - ననుచుతుదకునాప్రార్థనంగరిగి।
కేరినన్ను మెచ్చిసిత్రబతి - కింపగవరమిచ్చి
సారిదీవించిచనియెనంతగ - న్నారనుంటివిట్లుసుఖముతోడి॥జీ॥

సీ. అనిపలుకుచుండగనంతలోసత్యవంతునితెల్లితండ్రులద్భుతముమీర
చూడనేర్చెముదంబుతోదశత్రులనోడిత్తిరిగిమీరాజ్యము తెచ్చినార
మేలరండనుచుమంత్రిజాలము సేవింప నేతెంచిపుత్రునిచేతసకల
వృత్తాంతము నెరింగియెంతయు గోడల్నానుతించియీమావాజీవీరకాని

కనిపిరందరు తమదేశమునుగదలచి
యొక్కమార్రిట్టిసంపద నొసగినట్టి
సర్వమంగళకుం జయజయమటంచు
మధురముగనిట్లుపాడిరి మంగళంబు॥

## సురట — ఏక తాళము.

ప॥ మమ్ముగన్నతల్లి యోగీశ్వరీనీకు - మంగళమేజయమంగళమే ॥మ॥

అ॥ సమదగజగామినీశార్వాణీ - సంతతభక్తిసుఖదాయినీ ॥మ॥

౧ ఆగమవిపినమయూరీదుర్గామ - హాకాళీత్రిజగజ్జననీ।
యోగీశ్వరహృత్సరోమరాళీ - యుమాదేవి భువనైకసుందరీ॥మ॥

౨ నారాయణదాసపాలినీయ - నంతసుగుణశాలినీ
ధీరతనినుగొల్చుచు వారికిన్నావ-
ధీనముగుచునుండుమయు సారట ॥మ॥

౩. గానకవితావధాన ని
ధానులగు మహాత్ములార దయతో వినుడీ
దీనిరచియించి దుర్గా
ధీనమ్ముగ కృతినొసగితి మోక్షేచ్ఛ ॥

సంపూర్ణము.